
కొండను కదిలించిన మింగ్ లొ
ఆర్నాల్డ్ లొబెల్

# కొండను కదిలించిన మింగ్ లో

కథ, బొమ్మలు

ఆర్నాల్డ్ లోబెల్



ఒక పెద్ద కొండ కింద ఒక ఇంటిలో మింగ్ లో, అతని భార్య ఉండేవాళ్లు. వాళ్ల ఇల్లంటే వాళ్లకి ఎంతో ఇష్టం. కానీ, వాళ్లకి కొండ అంటే ఇష్టం లేదు.



కొండ అంచుల నుంచి రాళ్లు ఊడిపోతూ మింగ్ లొ ఇంటి మీద పడుతూ ఉండేవి. దాంతో ఇంటి కప్పులో రంధ్రాలు పడేవి. కొండ పైన మబ్బులు దట్టంగా కమ్ముకునేవి. ఆ మబ్బుల నుంచి కుండపోత వర్షం రంధ్రాలు ఉన్న కప్పు మీద పడేది. దాంతో ఇల్లంతా తడితడిగా ఉండేది.

సూర్యుడు వచ్చినప్పుడు కూడా మింగ్ లొ ఇల్లు వెచ్చబడేది కాదు. ఇంటి మీద ఎప్పుడూ కొండ నీడ పడుతుండేది. పెరడులో పూలు, కూరగాయల మొక్కలు పీలగా, పలచగా పెరిగేవి.





"ఈ కొండ వల్ల మనకి అన్నీ కష్టాలే,"
మింగ్ లొ భార్య అంది. "మనం ఇంటిలో
హాయిగా ఉండాలంటే నువ్వు కొండని
దూరంగా జరపాలి."

"నాలాంటి చిన్న మనిషి ఇంత పెద్ద
కొండని ఎలా కదిలించగలడు?"
అన్నాడు మింగ్ లొ.

"నాకు ఎలా తెలుస్తుంది?" అంది అతని
భార్య. "ఊరిలో ఒక జ్ఞాని ఉన్నాడు. వెళ్లి
అతనిని అడుగు."



ఊళ్లో ఉన్న జ్ఞాని వద్దకు మింగ్ లొ వెళ్లాడు. "నా ఇంటి దగ్గర ఉన్న కొండని దూరంగా జరపాలి," అన్నా   .

గుప్పు గుప్పు మంటూ పొగ వదులుతూ ఆ జ్ఞాని చాలా సేపు ఆలోచించాడు.

చివరికి అతను, "ఇంటికి వెళ్లి అన్నింటికంటే పెద్ద చెట్టుని కొట్టు, మింగ్ లొ. నీ బలమంతా ఉపయోగించి ఆ దుంగతో కొండ మొదలులో కొట్టు. ఆ విధంగా కొండని కదిలించవచ్చు," అన్నాడు.



మింగ్ లొ ఇంటికి పరిగెత్తాడు. అన్నిటిలోకి పొడవైన, లావైన చెట్టుని కొట్టాడు. మింగ్ లొ, అతని భార్య ఆ దుంగను పట్టుకుని, పరిగెత్తుకుంటూ వెళ్లి, వాళ్ల బలమంతా ఉపయోగించి ఆ కొండని కొట్టారు.



దుంగ రెండు ముక్కలయ్యింది. మింగ్ లొ, అతని భార్య వెల్లికిలా పడ్డారు. కొండ మాత్రం పిసరంత కూడా కదల లేదు.

"జ్ఞాని దగ్గరకు మళ్లీ వెళ్లు," మింగ్ లొ భార్య అంది. "కొండని కదిలించటానికి మరొక దారి చూపించమను."





జ్ఞాని మళ్లీ చాలాసేపు ఆలోచించాడు. అతని గొట్టం నుంచి పొగ గుప్పుగుప్పుమంటూ వస్తోంది.

చివరికి అతను, "మింగ్ లొ, ఇంటికి వెళ్లి గిన్నెలు, పాత్రలు తీసుకో. తరవాత గరిట తీసుకుని ఆ గిన్నెల మీద సాధ్యమైనంత గట్టిగా చప్పుడు చెయ్యి. గొంతెత్తి పెద్దగా అరువు, కేకలు వెయ్యి. ఈ మోతకి కొండ భయపడిపోతుంది. ఆ రకంగా కొండని అక్కడి నుంచి కదిలించవచ్చు," అన్నాడు.



మింగ్ లొ ఇంటికి పరిగెత్తాడు. వంటింటిలోంచి గిన్నెలు, పాత్రలు తీసుకొచ్చాడు. మింగ్ లొ, అతని భార్య చేతుల్లోకి గరిటెలు తీసుకుని గిన్నెలను గట్టిగా కొట్టసాగారు. పెద్దగా అరుస్తూ, కేకలు వెయ్యసాగారు.

ఆ మోతలకి, అరుపులకి పక్షులు బెదిరిపోయి, చెట్ల మీద నుంచి ఎగిరిపోయాయి. కాని కొండ మాత్రం ఇసుమంత కూడా కదల లేదు.

"మరోసారి జ్ఞాని దగ్గరకు వెళ్లు," మొత్తుకుంది మింగ్ లొ భార్య. "కొండని కదిలించటానికి ఏదో ఒక మార్గం కనుక్కోవాలి!"







జ్ఞాని సుదీర్ఘంగా ఆలోచిస్తూ ఉంటే మింగ్ లొ చూస్తూ కూర్చొన్నాడు. జ్ఞాని తాగే చిలుము నుండి మబ్బుల్లాగా దట్టంగా పొగ బయటకు వస్తోంది.

చివరికి అతను, "మింగ్ లొ, ఇంటికి వెళ్లి రొట్టెలు, అప్పచ్చులు చెయ్యి. కొండ మీద ఉండే భూతానికి వాటిని ఇవ్వు. భూతం ఎప్పుడూ ఆకలితో ఉంటుంది. నువ్వు పెట్టింది అది సంతోషంగా తింటుంది, నీ ప్రతి కోరికా తీరుస్తుంది. కొండని కదిలించటానికి ఇదే మార్గం," అన్నాడు.



మింగ్ లొ ఇంటికి పరిగెత్తాడు. భార్యతో కలిసి గంపలకొద్దీ రొట్టెలు, అప్పచ్చులు వండాడు. భూతం ఉండే కొండ మీదకి ఇద్దరూ కలిసి వాటిని తీసుకెళ్లసాగారు. పైకి ఎక్కుతున్న కొద్దీ గాలి తీవ్రత పెరగసాగింది. అది బలంగా వీస్తూ, హోరెత్తసాగింది. ఆ గాలికి రొట్టెలు, అప్పచ్చులు అటూ, ఇటూ ఎగిరిపోయాయి. భూతానికి ఒక్కటి కూడా మిగలలేదు. దాంతో కొండ అక్కడి నుంచి కదలలేదు.

భార్య ఏమీ అనక ముందే మింగ్ లొ వెంటనే జ్ఞాని దగ్గరకు వెళ్లాడు.



"నా ఇంట్లో ప్రశాంతంగా, సంతోషంగా ఉండటానికి ఈ కొండని కదిలించి నాకు మేలు చెయ్యండి!" అంటూ మొర పెట్టుకున్నాడు మింగ్ లొ.

చాలా సేపు ఆలోచనలో మునిగిపోయాడు జ్ఞాని. అతని పొగాకు గొట్టం నుంచి వచ్చిన పొగలో అతను మసక, మసకగా మాత్రమే కనపడుతున్నాడు.

చివరికి, "మింగ్ లొ, ఇంటికి వెళ్లు. నీ ఇంటి కర్రలు, తడికలు అన్నీ తీసి మోపులు కట్టు. నీ ఇంటిలో వస్తువులన్నీ మూటల్లో కట్టు. వీటన్నింటినీ నువ్వు, నీ భార్యా నెత్తి మీద, చేతుల్లో పట్టుకోండి. కొండ వైపుకి తిరిగి కళ్లు మూసుకోండి," అన్నాడు జ్ఞాని.







"ఇప్పుడు, కదులుతున్న కొండకి అనుగుణంగా నాట్యం చెయ్యాలి. ముందుగా కుడి కాలు వెనకగా ఎడమ కాలిని పెట్టండి. తరవాత ఎడమ కాలి వెనకగా కుడి కాలు పెట్టండి. చాల గంటల సేపు ఇలాగే అడుగులు వేస్తూ, నాట్యం చెయ్యండి. అప్పుడు కళ్లు తెరిసి చూస్తే కొండ చాలా దూరం వెళ్లిందన్న విషయం గుర్తిస్తారు," అన్నాడు జ్ఞాని.

"ఈ నాట్యం వింతగా ఉంది," అన్నాడు మింగ్ లొ, "కొండని కదిలిస్తుందంటే వెంటనే అలాగే చేస్తాను."



మింగ్ లో ఇంటికి పరిగెత్తాడు. ఒక్కొక్కటిగా కర్రలు, తడికలు లాగాడు. వస్తువులన్నిటినీ జమ చేశాడు.

మింగ్ లో, అతని భార్య వాటన్నిటినీ కట్టలుగా, మూటలుగా కట్టారు. వాటిని నెత్తి మీద, చేతులలో పట్టుకున్నారు.

తరవాత, కదిలే కొండ నాట్యం ఎలా చెయ్యాలో తన భార్యకు మింగ్ లో చూపించాడు. వాళ్లు కొండ వైపుకి తిరిగి, కళ్లు మూసుకున్నారు. జాగ్రత్తగా, నాట్యంలోని అడుగులు వెయ్యసాగారు.





వాళ్లిద్దరూ తమ ఎడమ కాలుని కుడి కాలు వెనక పెట్టారు. తరవాత ఇద్దరూ తమ కుడి కాలుని ఎడమ కాలు వెనక పెట్టారు.

తమ వస్తువులన్నింటినీ తీసుకుని మింగ్ లొ, అతని భార్య పొలాల గుండా వెనక్కి నడుచుకుంటూ వెళ్లటం ఇరుగు, పొరుగు వాళ్లు చూశారు.

ఆ వింత దృశ్యాన్ని వాళ్లు ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు.





చలా గంటల తరవాత మింగ్ లొ, అతని భార్య కళ్లు తెరిచారు.

"చూడు," అరిచాడు మింగ్ లొ, "మన నాట్యం పని చేసింది! కొండ చాలా దూరం వెళ్లిపోయింది!"



క్ర్ర క్ర్ర పెడుతూ ఇల్లు కట్టుకున్నారు. తమ మూటలన్నీ విప్పి, వస్తువులను సర్దుకుని ఇంటిని అమర్చుకున్నారు.

చక్కని ఎండ, వెలుగులో మింగ్ లొ, అతని భార్య మిగిలిన జీవితమంతా గడిపారు. వాన పడినప్పుడు కప్పులో రంధ్రాలు లేనందున ఇల్లు కారేది కాదు.

దూరంగా, చిన్నగా కనపడుతున్న కొండని వాళ్లు తరచు చూస్తూ ఉండేవాళ్లు. కొండని కదిలించగలిగామని నమ్మినందువల్ల వాళ్లు సంతోషంగా ఉండేవాళ్లు.



అయిపోయింది